శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః.

# శ్రీమద్రామాయణసంప్రదాయార్థసంగ్రహము.

---

శ్లో. శ్రీశైలపూర్ణాన్ మణిశేఖరేణ, శ్రుత్వా త్వరాష్టాదశధా ప్రభిన్నాన్ ।
రామాయణార్థాన్ క్రమశః కరోమి, వ్యక్తాన్ శఠారాతిగురూపదిష్టాన్.

యన్నట్లు మణిశేఖరాజులు శ్రీశైలపూర్ణులవలన వినినట్టి రామాయణార్థములు పదునెనిమిది. అవి యేవనఁగా.---

(1) ఈ రామాయణప్రబంధము. 'ప్రాయేణ పూర్వభాగార్థో ధర్మశాస్త్రేణ కథ్యతే । ఇతిహాసపురాణాభ్యాం వేదాన్తార్థః ప్రకాశ్యతే' అను వచనముంబట్టి యితిహాసమగుటచే వేదోపబృంహణరూపమగుటవలన వేదాంతార్థమును విస్తరించి తెలుపుచున్నది. అందు 'యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభిసంవిశన్తి - తద్విజిజ్ఞాసస్వ - తద్బ్రహ్మ' అని శ్రుతి జిజ్ఞాస్యమగు బ్రహ్మమును జగజ్జన్మాదికారణముగాఁ బ్రతిపాదించుచున్నది. జగజ్జన్మాదికారణ మగు నా బ్రహ్మము విష్ణువా? లేక రుద్రాదులం దొకరా? అని తెలియఁగోరఁగా రాముఁడై యవతరించినవిష్ణువే వేదాంతవేద్యం బయిన యా పరబ్రహ్మమని యిందు చెప్పఁబడుచున్నది. 'ఉపక్రమోపసంహారావభ్యాసో౽పూర్వతా ఫలమ్ । అర్థవాదోపపత్తీచ లిఙ్గం తాత్పర్యనిర్ణయే' 'ఉపక్రమము, ఉపసంహారము, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్థవాదము, ఉపపత్తి' అని తాత్పర్యమున కాఱువిధము లయిన లింగములు గలవు. ఆయాఱువిధములు నిందుఁ గలిగి యున్నవి. ఎట్లన, ఉపక్రమమందు 'కోన్వస్మిన్ సాంప్రతం లోకే' ఇత్యాదులచే 'వేదాంతోదిత సకలగుణసంపన్నుఁడగువాడు విష్ణువా లేక బ్రహ్మాదులం దొకఁడా'? అని వాల్మీకి యడుగఁగా నారదుఁడు. 'ఇక్ష్వాకువంశ ప్రభవో రామః' ఇత్యాదులచే రాముఁడయి యవతరించి విష్ణువే వేదాంతోక్తసకలగుణసంపన్నుఁడని చెప్పెను. ఉపసంహారమందును చతుర్ముఖుఁ డగు బ్రహ్మ 'త్వామహం పూర్వకే భావే పుత్రః పరపురఞ్జయ । సంక్షిప్య చ పురా లోకాన్మాయయా స్వయమేవహి । మహార్ణవే శయానో౽ప్సుమాం త్వం పూర్వమజీజనః । పద్మే దివ్యే౽ర్కసంకాశే నాభ్యాముత్పాద్య మామపి । ప్రాజాపత్యం త్వయా కర్మ సర్వం మయి నివేశితమ్' అనెను. దీనిచే సర్వజగత్కారణుఁ డగు ప్రజాపతికిని జనకుఁ డగుటచే సకల జగత్కారణ మగు బ్రహ్మము విష్ణువే యని చెప్పఁబడినదయ్యెను. అభ్యాసముగూడ నావిష్ణువునకే చూపట్టుచున్నది. బాలకాండమందు 'ఏతస్మిన్నన్తరే విష్ణురుపయాతో మహాద్యుతిః । శఙ్ఖచక్రగదాపాణిః పీతవాసా జగత్పతిః' అని జగత్కారణత్వము చెప్పఁబడెను, అటమీఁద దేవతలు 'త్వంగతిః పరమా దేవ సర్వేషాం నః పరన్తప' అని

తమకెల్ల పరమగతిగాఁ జెప్పిరి. దీనిచే పరత్వమునకు మాత్రమే కల సర్వశరణ్యత్వము చెప్పఁబడెను. అవ్వల, 'తతో దేవర్షిగన్ధర్వా స్ససిద్ధాస్సమహర్షయః । స్తుతిభిర్దివ్యరూపాభిస్తుష్టువుర్మధుసూదనమ్' అని దేవర్షిగన్ధర్వాదులు స్తుతిచేయుటను జెప్పుటచే సర్వస్తుత్యత్వము చెప్పఁబడినది. అంత విశ్వామిత్రుండు 'వేదాహమేతం పురుషం మహాన్తమ్ । తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి । యజ్ఞేన దానేన తపసానాశకేన' ఇత్యాది శ్రుతులయందుఁ జెప్పఁబడినరీతిని 'అహం వేద్మిమహాత్మానం రామం సత్యపరాక్రమమ్ । వసిష్ఠోఽపి మహాతేజా యే చేమే తపసిస్థితాః' అని యతఁడు మహాపురుషుండనియు తపోబలములేక యతనిని దెలియుట కష్టమనియుఁ జెప్పెను. సీతావివాహమున వసిష్ఠుండు 'అవ్యక్తప్రభవో బ్రహ్మా శాశ్వతో నిత్య అవ్యయః । తస్మాన్మరీచి స్సంజజ్ఞే మరీచేః కాశ్యపస్సుతః' అని బ్రహ్మాదులందఱకు నన్నింటికిని మూలకారణముగాఁ బ్రకటించినాఁడు. పరశురాముఁడును 'అధికం మేనిరే విష్ణుం దేవాస్సర్షిగణాస్తదా' అని దేవతలందఱును విష్ణు నధికునిఁగాఁ దలంచిరనుటచే నతని సర్వాధికత్వమును నిదర్శించినాఁడు. అయోధ్యాకాండమున 'సహి దేవైరుదీర్ణస్య రావణస్యవధార్థిభిః । అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణుస్సనాతనః' అని యతని సనాతనత్వము చెప్పఁబడెను. అటుమీఁద 'ఆకాశప్రభవో బ్రహ్మా శాశ్వతో నిత్య అవ్యయః' అనుచో బ్రహ్మదేవుని నాకాశమువలనఁ బుట్టినవాఁడని విష్ణువునాకాశశబ్దముచే నిర్దేశించుటవలన నతనిస్వయంప్రకాశత్వమును వ్యాపకత్వమును జెప్పఁబడినవి. ఆరణ్యకాండమున మారీచుఁడు 'అప్రమేయంహి తత్తేజో యస్య సా జనకాత్మజా'యని యతని తేజము నప్రమేయమైనదిగాఁ జెప్పుటచే నతఁడు పరిచ్ఛేదాతీతమహిమ గలవాఁడగుట చెప్పఁబడెను. కిష్కింధాకాండమున తార 'నివాసవృక్షస్సాధూనామాపన్నానాం పరాగతిః । ఆర్తానాం సంశ్రయశ్చైవ యశసశ్చైకభాజనమ్ । జ్ఞానవిజ్ఞానసంపన్నో నిదేశే నిరతః పితుః । ధాతూనామివ శైలేన్ద్రో గుణానామాకరో మహాన్ । త్వమప్రమేయశ్చ దురాసదశ్చ జితేన్ద్రియశ్చోత్తమధార్మికశ్చ । అక్షయ్యకీర్తిశ్చ విచక్షణశ్చ క్షితిక్షమావాన్ క్షతజోపమాక్షః' అని చెప్పినది. దీనిచే జ్ఞానానందాది సమస్తకల్యాణగుణాకరత్వము చెప్పఁబడినది. సుందరకాండమున 'బ్రహ్మా స్వయంభూశ్చతురాననో వా రుద్ర స్త్రినేత్ర స్త్రిపురాన్తకో వా । ఇన్ద్రో మహేన్ద్ర స్సురనాయకో వా త్రాతుం న శక్తా యుధి రామవధ్యమ్' అని సర్వసంహారకత్వము చూపఁబడెను. 'కిం వైష్ణవం వా కపిరూపమేత్య రక్షోవినాశాయ పరం సుతేజః । అనన్త మవ్యక్త మచిన్త్యమేకం స్వమాయయా సాంప్రతమాగతం వా' అని చెప్పఁబడినది. ఇట రెండవ 'వా'కారము అవధారణార్థకము. ఈశ్లోకముచే అనన్తరూపత్వము చెప్పఁబడెను. యుద్ధకాండమున విష్ణువే జగత్కారణమగుట యెట్లని ఇతరులకుఁగూడ 'హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే । యదాతమ స్తన్న దివానరాత్రిః ।

దేవాలయముండిన యెడ గృహస్థుఁడే దానిపూజకుఁడని స్వారస్యముగా తెలియునగు చున్నది. అట్లె యిందును గ్రాహ్యము. కాన మఱియొకవిధముగాఁ జెప్పఁబడు (అనఁగా నగస్త్యుఁడు బ్రహ్మాదిపూజకుఁడుగా నుండఁగా బ్రహ్మాదులగస్త్యపూజ కులుగా నున్నారని చెప్పుటకు) నయితిలేదు ఇంతేకాక సత్యయజ్ఞనధమును 'యస్మాద్భాగార్థినో భాగః కల్పితో నైవ మే సురాః । వరాఙ్గాణి మహార్హాణి ధనుషా శాతయామి వః'అని రుద్రునకు యజ్ఞభాగమును గల్పింపనందుకు నక్రుద్ధుఁడగుటంబట్టి యిందు నతనికి స్థానము నిర్దేశింపఁబడదయ్యె. విష్ణువు పరదేవతయగునేని యిప్పు డతఁడు రాముఁడుగా జన్మించుట యెట్లుగి జన్మమెత్తుట వికారశూన్యుఁడగు పరదైవమునకుఁ జెల్లదేయన్నచో 'అజాయమానో బహుధా విజాయతే' అన్నగీతిని లోకమునను గ్రహించుకొఱకు జన్మరహితుఁడయ్యు స్వేచ్ఛచేనట్లు జన్మించుచున్నాఁడని గ్రహించినచో ప్రశ్నమున కవకాశముండదు. అట్టి పరదైవమునకే చెల్లునట్టి మోక్షప్రదత్వమును 'యాగతిర్యజ్ఞశీలానామాహితాగ్నేశ్చయాగతిః । అపరావర్తినాంయాచయాచ భూమిప్రదాయినామ్ । మయాత్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకాననుత్తమాన్' అనియిట నుత్తమలోకముల నాయనుజ్ఞచేఁ బొందుమనను టచేఁ జెప్పఁబడినదయ్యె ఇట అపరావర్తిత్వమనఁగా పునరావృత్తి శూన్యత్వము అనఁగాముక్తి 'నచపునరావర్తతే' అనిశ్రుతి. అపరావర్తి యనుటచే యుద్ధము నుండి పాఱిపోకుండుట చెప్పంబడినదని చెప్పవలనుగాదు. జటాయువు యుద్ధము నుండి పాఱిపోకుండుట యతనివలననే సిద్ధించినదికాని రామునివలనఁగాదు. కాన దానికి ఫల మతఁడే సంపాదించుకొనియుండుటచే రాముఁడు తానై యనుగ్రహించి యియ్యవలసినదిలేదు. కానయాయర్థము చెప్పఁజూనఁగదు. కాఁబట్టి యజ్ఞాదిఫలములకు నెల్లయగుముక్తిని బొందుమనియర్థము. కావుననే నృసింహపురాణమందు 'మత్కృతే నిధనం యస్మాత్త్వయాప్రాప్తం ద్విజోత్తమ । తస్మాత్త్వం మత్ప్రసాదేన విష్ణులోక మవాప్స్యసి' అని విష్ణులోకమును (అనఁగా ముక్తిని) బొందునట్లు చెప్పఁబడియున్నది. ఇట్లు ఉపక్రమము మొదలయిన యాఱువిధములగు తాత్పర్యలింగములచే వేదాన్తవేద్యమగు పరతత్త్వము విష్ణువేయని శ్రీరామాయణముచే విస్తరించి ప్రతిపాదింపఁబడుచున్నది. ఇట్లె కడపట బ్రహ్మయు 'అస్యాః పరిషదో మధ్యే యద్బ్రవీమి నిబోధతత్ । ఏతదేవహికావ్యంతే కావ్యానాముత్తమంశ్రుతమ్ । సర్వం విస్తరతో రాజన్వ్యాఖ్యాస్యతి ననంశయః । ఆదికావ్యమిదం రామత్వయి సర్వంప్రతిష్ఠితమ్ । నహ్యన్యోఽర్హతికావ్యానాం యశోభాగ్రాఘవాదృతే' అని యీరామాయణకావ్యమే కావ్యములందుత్తమమయినదనియు నాదికావ్యమనియు నదియంతయు రామునియందే నెలకొనియున్నదనియు కావ్యములవలని యశస్సును బొందునట్టి రాఘవుఁడు తప్ప మఱొక్కఁడు దీనిని బొంద నర్హుఁడుగాఁడనియుఁ జెప్పెను. ఇట్లుండఁగా నెవఁడేని యీరామాయణము

వ్యంజనావృత్తిచే శివపరమయినదని చెప్పనేని యది యపహాస్యమేయగును. 'నహ్యా న్యోర్హతి' అని నిషేధింపఁబడిన రుద్రుండు రామాయణమునకుఁ బ్రతిపాద్యమగు వస్తుకోటిలో నంతర్భవించినాఁడని చెప్పుట కేవలము బాలిశుని వదరుమాటయే యగును. రాముఁడు సూర్యోపస్థాపనాదికము చేయుటయంతయు విశ్వామిత్రాదుల నుపాసించుటంబోలె మనుష్యభావన ననుసరించి చేసినట్లు తెలియునది. నిగమమే మనఁగా 'శ్రీవిష్ణోః ప్రథమేకాణే జగజ్జననహేతుతా।ద్వితీయేస్థితిహేతుత్వం తృతీయే మోక్షదాయితా। చతుర్థే గుణసంపత్తిః పఞ్చమేసర్వహన్తృతా। షష్ఠే వేదాన్త వేద్యత్వం సప్తమే స్రష్టృహేతుతా॥ ఏవం విష్ణుఃపరంతత్త్వంరామాత్మేతిసునిశ్చితమ్. 'శ్రీవిష్ణునకు ప్రథమకాండమందు జగజ్జననమునకు హేతువగుటయు,ద్వితీయమునదానిస్థితికి హేతువగుటయు, తృతీయమున మోక్షప్రదుండగుటయు, చతుర్థమున గుణసంపత్తియు, పంచమమున సర్వసంహారకుఁడగుటయు, షష్ఠమున వేదాన్తవేద్యుఁడగుటయు, సప్తమమున స్రష్టకుహేతువగుటయుఁ జెప్పఁబడినది. ఇట్లు పరతత్త్వమగు విష్ణువే రాముఁ డయ్యెనని చక్కఁగా నిశ్చయింపఁబడినది. ఇది యొక యర్థము.

(2) వాల్మీకి ఇటువంటిపరతత్త్వము ఏయుపాయముచే ప్రాప్య మగును? అని తెలియఁగోరఁగా తత్ప్రాప్తికి నుపాయమయిన శరణాగతిని 'యోబ్రహ్మాణం విదధాతిపూర్వం యోవై వేదాంశ్చప్రహిణోతితస్మై।తగ్ంహదేవమాత్మబుద్ధిప్రసాదం ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే। అనెడిశరణాగతిశ్రుతి నుపబృంహణము సేయుచు,ఈరామాయణమందుపక్రమము మొదలుపసంహారమువఱకు ననేకాధికారులనుఁగలిగినయాయాఫలవిశేషములను మొదలగువానిని బ్రదర్శించుచుమూలమున సఖలఫలసాధన మయినదిగా దానిని బ్రతిపాదించుచున్నాఁడు. ఎట్లన, ఉపక్రమమందు 'ఏతస్మిన్నన్తరే విష్ణురుపయాతో మహాద్యుతిః। శఙ్ఖచక్రగదాపాణిఃపీతవాసా జగత్పతిః। అని సర్వశేషి యగునర్వేశ్వరుఁడు 'రక్షింపుమా'యని తన్నితరు లపేక్షింతురా యనియెదురుచూచుచు నట్టిరక్షణసమయము లభించిన దని సంతోసమున మతింతయౌజ్జ్వల్యము పొడసూప రక్షణోపకరణము లగుచక్రాదులతోడ సన్నద్ధుఁడై వచ్చి దేవతలకడ నిలిచెను. అపుడు దేవగంధర్వయక్షులును 'తతస్త్వాం శరణాగతాః' అని రావణవధ మనెడిలాభమునుగోరి దేవజాతీయులందఱును శరణాగతింగావించిరని చెప్పఁబడియున్నది. పిదప త్రిశంకు శునశ్శేఫాది వృత్తాంతములందు విశ్వామిత్రాదుల వ్యాపారవిశేషములను జెప్పి శరణాగతరక్షణము పరమధర్మమనియు సమర్థుఁడును కారుణికుఁడు నగువానిని శరణుఁజొచ్చుటకుఁ దప్పక ఫలముగలిగియే తీఱుననియుఁ బ్రదర్శింపఁబడెను. పిదప 'సభ్రాతుశ్చరణౌగాఢంనిపీడ్యరఘునన్దనః। సీతామువాచాతియశాః రాఘవంచ మహావ్రతమ్। అని లక్ష్మణుఁడు రామునిపాదముల గట్టిగాఁ బట్టుకొని సీతాదేవినిజూచి చెప్పెననుటచే పురుష

కారపురస్కరణమును ముడ్చిడుకొని శరణాగతి చేయవలయునని చెప్పఁబడెను. పిదప భరతుఁడు 'శిశ్యేపురస్తాచ్ఛాలాయాం యావ న్నే న ప్రసీదతి' అని రామాభిషేక మనెడిఫలముకొఱకు శరణవరణమును జేసినాఁడు. ఇట రావణవధమునకై దేవతలు చేసిన ప్రపత్తికి (అనగా శరణాగతికి) ఫలమొసంగుటకై నగరము నుండి బయలువెడలినవాఁ డగుటంబట్టి యిపుడు రాముఁడు తనకుఁ బ్రతినిధియగు పాదుకల నొసంగి భరతునిశరణాగతిని సఫలముచేసి పిదప దేవగణములకు నోరథమును రావణాదివధముచేఁ బూరించినయనంతరము, తనకు నభిషేకమును చేసికొన్నాఁడు. కాఁబట్టి శరణాగతికి వైఫల్యము కల దనియూహింపరాదు.పిమ్మట దండకారణ్యమున వసించు మును లందఱివిరోధులను నిరసించుటకై 'తేనయం భవతా రక్ష్యో భవద్విషయవాసినః।నగరస్థో వనస్థోవా త్వం నో రాజా జనేశ్వర'అనిశరణాగతి నమష్ఠించిరి. ఇట కోసలజనపదవాసులకుంబోలె మునులకును భగవద్దేశవాసమే శరణాగతి.తదనంతరము 'సపిత్రాచపరిత్యక్తస్సురైశ్చసమహర్షిభిః।త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణంగతః।సతంనిపతితం భూమౌశరణ్యశ్శరణాగతమ్।వధార్హమపి కాకుత్స్థః కృపయాపర్యపాలయత్' అని రామునిముంగల నేలంబడినకాకాసుర వృత్తాంతమున మ్రోలఁ బడుటయే శరణాగతి యని ప్రదర్శింపఁబడెను. పిదప సుగ్రీవవృత్తాంతమున 'కృతాపరాధస్యహి తే నాన్యత్పశ్యామ్యహం క్షమమ్। అన్తరేణాఞ్జలిం బద్ధ్వా లక్ష్మణస్య ప్రసాదనాత్' అని యంజలిబంధమును జెప్పుటచే శరణాగతి యంజలిరూపముగఁ జెప్పఁబడెను. పిదప సీత రావణునిఁగూర్చి చెప్పినవాక్యమున'మిత్రమౌపయికం కర్తుం రామః స్థానంపరీప్సతా। వధంచానిచ్ఛతా ఘోరం త్వయాసౌపురుషర్షభః॥ విదితస్సహిధర్మజ్ఞఃశరణాగతవత్సలః। తేనమైత్రీభవతుతే యదిజీవితు మిచ్ఛసి' అని రామునితోడి మైత్రి గలిగియుండుటను జెప్పుటచేఆనుకూల్యమే శరణాగతి యని బోధింపఁబడినదయ్యె. అటమీఁద విభీషణుఁడు 'సోఽహం పరుషిత స్తేన దాసవచ్చావమానితః । త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణంగతః' అని చేసినశరణాగతి విరోధులను బరిత్యజించి చేయంబడినదిగాఁ జెప్పఁబడినది. 'తత స్సాగరవేలాయాం దర్భా నా స్తీర్య రాఘవః । అఞ్జలిం ప్రాఙ్ముఖః కృత్వా ప్రతిశిశ్యేమహోదధేః' అను రామశరణాగతిచే యోగ్యుని కయోగ్యత వెదకరాదనియు నయోగ్యునికి యోగ్యత లేదనియుఁ జెప్పఁబడెను. అశుచిభూతమయిన లంకనుండి బయలువెడలునంతమాత్రమే కద విభీషణుఁడు శరణము వరించినది. రామశరణాగతి, సమర్థుఁడగుకారుణికుని గుఱించి చేయంబడమిచే, దానికి ఫలము లేదయ్యెనందురు. మీఁద 'అభియాచామ వైదేహీమేతద్ధి మమ రోచతే । రాఘవాద్ధి భయంఘోరం రాక్షసానాముపస్థితమ్' అని సీతకుఁ గాపున్న రాక్షసస్త్రీలకుఁ ద్రిజటచెప్పినమాటకు వా రనుమతించినంతమాత్రమున నారాక్షసస్త్రీల నందఱను హనుమంతునివలనిభయమునుండి రక్షించునదగునని చెప్పుటచే వేఱొకని

విషయమునందు వేఱొకరుచేయు శరణాగతికూడ ఫలప్రదమగునని నిరూపింపఁబడెను. విభీషణుని శరణాగతిచేసిన యతని మంత్రులకుఁగూడ [illegible] శరణాగతుని సంబంధించినవారికూడ భగవత్కటాక్షమునకుఁ బాత్రులగుదురని నిశ్చయింపఁబడెను. ఇట్లే యితరత్రను దెలియునది. ఇట్లుపక్రమము మొదలుగా నుపసంహారమువఱకుఁ బ్రతిపాదింపఁబడిన శరణాగతియే సర్వఫలప్రదమయినది అదియే ముక్తికిఁగూడ హేతువని చెప్పఁబడెను.

(౩) ఈ యుపాయమునకుఁ బ్రాప్యము భగవత్ప్రాప్తిపూర్వక మయిన కైంకర్యమే యని రామాయణముచేఁ బ్రతిపాదింపఁబడుచున్నది. ఎట్లన, ఉపక్రమమునందు దేవజాతీయులశరణాగతికి రామకైంకర్యము ప్రధానఫలముగా చెప్పఁబడుచున్నది ఏలన, వారలప్సరసలు మొదలగువారియం దవతరించి రాముననుసరించునట్లుపదేశము చేయఁబడినది. దీనింబట్టి వారి [illegible] రాము (అనఁగా భగవంతుని) కైంకర్యమే ప్రధానమగుఫలము; రావణవధము ఆనుషంగిక ఫలము. లక్ష్మణుఁడును, ప్రపత్తి చేసి 'అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే। భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే' అని చెప్పినాఁడు. దీని వ సర్వదేశ సర్వకాల సర్వావస్థోచితమగు సర్వవిధకైంకర్యము ఫలమని [illegible] మగుచున్నది. భరతుఁడును రామకైంకర్యమునకే యతనియభిషేకమును బ్రార్థించి యున్నాఁడు. పాదుకాకైంకర్యమును దొడంగి యాక్రమముగానే తాను గోరిన రామకైంకర్యమును లభించినవాఁడయ్యె. [illegible] శబర్యాదులగువారల శరణాగతికిని [illegible] నిరూపమమగు కైంకర్యమే ఫలమని తెలియుచున్నది 'తేషాం సోమమివ్రా ద్యస్తు దృష్ట్వా వై ధర్మచారిణః। మఙ్గళాని ప్రయుఞ్జానాః ప్రత్యగృహ్ణన్ దృఢవ్రతాః' అనుటవలన మంగళములను ప్రయోగించుటయె నాటికి కైంకర్యమని తెలియునది. సుగ్రీవవిభీషణాదుల ప్రపత్తికిని ముఖ్యమగుఫలము కైంకర్యమే. తక్కినవి యానుషంగికములని స్పష్టము. 'అథ హరివరనాథః ప్రాప్యసంగ్రామకీర్తిం। నిశిచరపతిమాజౌ యోజయిత్వా శ్రమేణ। గగన మతివిశాలం లఙ్ఘయిత్వార్కసూను। హరివరగణమధ్యే రామపార్శ్వం జగామ॥'' అని సుగ్రీవునిగూర్చి చెప్పుటంబట్టియు 'పరిత్యక్తా మయా లఙ్కా మిత్రాణి చ ధనాని చ। భవద్గతం మే రాజ్యం చ జీవితం చ సుఖాని చ' అన్న విభీషణ వాక్యమునుబట్టియు వారికిఁ గైంకర్యమె ఫలమని తెలియుచున్నది. ప్రాణార్థియగు కాకికిఁ బ్రాణము నొసంగుటచే దానిప్రపత్తిసఫలము. అసత్స్వభావముగల యది మరల నట్టి దుర్మార్గమందుఁ బ్రవర్తింపకుండుఁగాక యని శిక్షించురూపమున ననుగ్రహము చూపుకొఱకు నొకకన్ను హరించుటతో నస్త్రమును నివర్తింపఁజేసెను. ఇది, పరశురామునిగుఱించి వైచిన యస్త్రము నతఁడు ప్రతికూలుఁడై యుండుటను మానినంత, నతఁడు కోరిన విరోధులగు సుకృతములందుఁ బ్రయోగించినట్లును సముద్రముపయి వేయఁగయికొన్న

యస్త్రమును పశ్చాత్తాపము నొంది శరణుఁజొరఁగానే 'ద్వేషించువారియుఁ దాశ్రితుల చే సత్కృత్యులును జొనుపు'ననెడి న్యాయమున నతనికి విరుద్ధు లయిన యసురుల ముందుఁ బ్రయోగించినట్లును దెలియునది. రాముఁడు సముద్రునిగుఱించి చేసినశరణాగతి ఆకించన్యము అనన్యగతిత్వమున నెడి యధికారములు లేకయే చేయఁబడుటంబట్టి అల్పజ్ఞుఁడు నల్పశక్తియు నగువానిగుఱించి చేయంబడుటంబట్టి యువిఫలమయినదని చింతించునది. 'సముద్రం రాఘవో రాజా శరణం గన్తు మర్హతి' అని విభీషణుఁడు రామునితో సముద్రుని శరణుఁజొరుమని చెప్పెను గదా. తనశరణాగతికి ఫలము కలుగుటను జూచి యట్లుచెప్పెనాఁడని తెలియునది. కాఁబట్టి యీప్రకారముచేత, శరణాగతికి దేశ, కాల, అధికారి, ఫల, నియమము లేకపోయినను విషయనియమ మున్నదని చెప్పఁబడినదయ్యె ఈప్రపత్తి యీప్రబంధమునఁ బ్రధానమయినదిగాఁ బ్రతిపాదింపఁబడుచున్నది. కాఁబట్టియే శ్రీరామాయణము దీర్ఘశరణాగతియని లోకవార్త. శరణాగతి కుపయుక్తముగా నిరాకరములయినయర్థములింక ప్రతిపాదింపఁబడుచున్నవని తెలియునది ఎట్లన, సమర్థుఁడును గారుణికుఁడును సుశీలుఁడు నయినవానినిగుఱించిన శరణాగతి, ఫలము నిచ్చునది. అందు రుద్రధనుర్భంగము, పరశురామజయము, సాలభేదనము, సముద్రబంధనము మొదలయినవి పూర్వోక్త మయినపరత్వమును ప్రతిపాదించుచున్నవి గావున వానిచే సామర్థ్యమును సర్వజ్ఞత్వాదికమును జెప్పఁబడినవి. సీతావియోగకాలమందు జరిగినవృత్తాంతవిశేషములచే పరమకారుణికత్వమును, గుహునితోను శబరితోను సుగ్రీవాదులతోను దట్టమయిన సంశ్లేషముచే సౌశీల్యమును, విశ్వామిత్రయజ్ఞమును గాచుట, దండకారణ్యవాసు లగుమునిజనులను రక్షించుట, రావణబాధితు లయిన యింద్రాదిసకలదేవగణములను బరిపాలించుట యనువీనిచే తను తన జనపదములందలిజనులకు తనసౌందర్యశీలాదులచేతఁ బ్రీతి గలిగించి తన సాకేతావతారమునకుఁ బ్రయోజన మైనదియు తనపదమును ప్రాపించురూపమయినదియు నగుమోక్షము నొసఁగుటచేతను సర్వరక్షకత్వమును; జెప్పఁబడినవయ్యె. కాఁబట్టి సమర్థుఁడును పరమకారుణికుఁడును సుశీలుఁడునగు భగవంతుని గుఱించిన ప్రపత్తి సకలఫలసాధనమయినదయ్యె, అధికారివిశేషముచే ననుష్ఠింపఁబడిన యద్దానికి భగవత్ప్రాప్తి పూర్వక మగుతత్కైంకర్య మనెడిమోక్షమే ముఖ్యమయినఫలము. ఫలాంతరము లానుషంగికము లనుటస్పష్టము. ఇట్లె యంతటను దెలియునది.

(4) ఈప్రపత్తిపురుషకారము లేక ఫలము కలిగింప దనెడియీయర్థ మీగ్రంథమునఁ బ్రధానమైనదిగాఁ బ్రతిపాదింపఁబడుచున్నది. 'సీతాయాశ్చరితం మహత్' అని పురుషకారభూత యగుసీతాదేవి మహాచరిత్రముగాఁగదా యిది చెప్పఁబడినది. ఆదేవియొక్క మూఁడువిశ్లేషములచే వరుసగాఁ గృపయు పారతం

త్ర్యమును అనన్యార్హత్వము ననెడుపురుషకారధర్మములు ప్రతిపాదింపఁబడినవి. ఆమెసన్నిధానముచే కాకిమునకుఁ దల దక్కెను అది లేనందున రావణునకుఁ దలలు ఒక్కటయ్యెను. విభీషణుఁడును 'నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్' అని తన్ను రామునకుఁ దెలుపునట్లు వానరులను వేఁడుటచే ఘటకమూలమున నే రామశరణమును వరించెను. రాముఁడును, 'ఆనయైనం హరిశ్రేష్ఠ' అని ఘటకమూలమున నే విభీషణుని విషయీకరించెను. ఇట్లు సుగ్రీవుఁడును రామభక్తుఁడగుహనుమంతునిమూలమున నే రాముని శరణుఁ బొందెననియే తెలియునది.

(5) ఇటువంటియుపాయమున కధికారి యగువాని స్వరూపము శేషత్వమును భాగవతపారతంత్ర్యమును.

అందు శేషత్వము 'అహమస్యావరో భ్రాతా గుణైర్దాస్యముపాగతః । కురుష్వ మా మనుచరం వైధర్మ్యం నేహ విద్యతే । కృతార్థోఽహం భవిష్యామి తవ చార్థః ప్రకల్పతే।' ఇత్యాదులందలి దాసత్వము అనుచరత్వము మొదలగు లక్ష్మణుని యాచారముచేతఁ బ్రకాశింపఁ జేయఁబడినది.

(6) భరతునిమూలమున భగవత్పారతంత్ర్యము ప్రకటింపఁబడినది. 'విలలాపసభామధ్యే జగర్హే చ పురోహితమ్ । రాజ్యంచాహంచ రామస్యధర్మం వక్తుమిహార్హసి' అను నివి మొదలు 'సర్వాత్మనాపర్యనునీయమానో యదా న సౌమిత్రిరుపైతి యోగమ్ । నియుజ్యమానో భువి యౌవరాజ్యే తతోఽభ్యషిఞ్చద్భరతం మహాత్మా' అనువఱకును భరతుని పారతంత్ర్యము ప్రకటింపఁబడినది.

(7) శత్రుఘ్నునివ్యాపారముచే భాగవతపారతంత్ర్యము ప్రకాశితమైనది. 'గచ్ఛతా మాతులకులం భరతేన తదానఘః । శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నః నీతః ప్రీతి పురస్కృతః' ఇత్యాదులచే నిది చెప్పఁబడినది.

(8) ఈయధికారికి జ్ఞాతవ్యమయిన అర్థపంచక మిందుఁ జెప్పఁబడినది. 'ప్రాప్యస్య బ్రహ్మణో రూపం ప్రాప్తుశ్చ ప్రత్యగాత్మనః। ప్రాప్త్యుపాయం ఫలం ప్రాప్తేస్తథా ప్రాప్తివిరోధి చ ॥ వదన్తి సకలా వేదా సేతిహాసపురాణకాః। మునయశ్చ మహాత్మానో వేదవేదార్థపారగాః' అని ప్రాప్యంబగు బ్రహ్మముస్వరూపమును బ్రహ్మ

మును బ్రాపించు ప్రత్యగాత్మస్వరూపమును, బ్రహ్మప్రాప్తికిని పాయమును ప్రాప్తికి ఫలమును ప్రాప్తికి విరోధియనను వీనిని సకలవేదములను నితిహాసపురాణములను మహాత్ములును వేదవేదాంగపారంగతు లయినమునులును జెప్పుచున్నారు.
అని యీపంచకము చెప్పబడియున్నది. ఇందు రాముని ప్రస్తావనచే పరస్వరూపమును, లక్ష్మణాదివృత్తాంతముచే ప్రత్యగాత్మస్వరూపమును, శరణాగతిని నిర్ణయించుటచే నుపాయస్వరూపమును, విభీషణాదికథచే భగవత్కైంకర్యరూపఫలస్వరూపము, రావణాదివృత్తాంతముచే విరోధిస్వరూపమును జెప్పంబడినదని తెలియునది.

(9) ఈ యధికారికి ఆకించన్యమును అనన్యగతిత్వమును అపేక్షితము అని చెప్పుటకు బ్రహ్మరుద్రాదులు వరములొసగియున్న రావణునివధముచేత బ్రహ్మరుద్రాదిదేవతాంతరములయు, దశరథచరిత్రముచేత తండ్రియొక్కయు, కై కాదివృత్తాంతముచేత తల్లి మొదలగువారలయు, విభీషణమేఘనాదాదివృత్తాంతములచే భ్రాతృపుత్రులయు అరక్షకత్వము చెప్పబడినది.

(10) ఈయధికారికి భగవజ్జ్ఞానలాభము ఆచార్యునిమూలమున గలుగుచున్నది అని హనుమంతునిచరిత్రముచే జూపబడెను.

(11) ఈయధికారి 'కృతకృత్యాః ప్రతీక్షన్తే మృత్యుం ప్రియమివాతిథిమ్' 'కృతకృత్యులయినవారు మృత్యువును ప్రియాతిథివలె నెదురుచూచుచుందురు' అన్నరీతి శరీరపాతము కలుగునంతకాలము నెదురుచూడవలయునని, సీతాధ్యవసాయముచే జెప్పబడుచున్నది 'శరైస్తు సంకులాం కృత్వా లఙ్కాం పరబలార్దనః। మాం నయేద్యది కాకుత్స్థ స్తత్తస్య సదృశం భవేత్' అని రాముడే బాణములచే లంకను గప్పి శత్రులనుజుమాడి తన్నుగొనిపోవుటయుక్తమని కదా సీత చెప్పినది ఇట లంకయనగా శరీరము. రావణకుంభకర్ణులహంకారములు. ఇంద్రజిత్తు మొదలగువారు కామక్రోధాదులు. విభీషణుడు వివేకము. లంకయందు జెఱపెట్టబడినసీత చేతన. ఆచేతనునకుభగవజ్జ్ఞానము హనుమంతుడనెడి యాచార్యునిచేత, ఇట్టిశరీరమును ధ్వంసము ముందుగాగావించి దానిలోపల జెఱబడియున్న చేతనుని ఉద్ధరణము భగవంతుడే చేయునని తెలియునది.

(12) 'ఈయధికారి శరీరము వ్యంగమైనప్పుడు తాను జేయవలసిన దాని విషయ మందు రామునివలె వర్తించునది; రావణాదులవలెం గాదు' అనియుపదేశము యథా యోగముగాం జేయంబడుచున్నది.

(13) ఈయధికారి వాసము సేయుటకుయోగ్యమయిన దేశము భగవత్సన్నిధి గలదేశమే అని కోసలజనపదమందుం గలజనులవృత్తాంతముచేత చెప్పంబడినది.

(14) ఈయధికారికి రామానుజులను ద్వయవివరణముగలదగుటచే కాల క్షేప మీరామాయణముచేతనే. కావున నే రామాయణము దీర్ఘశరణాగతియని యభియుక్తులచేం జెప్పంబడినది. ద్వయము అర్థానుసంధానముతోంగూడ సదా చెప్పుచున్నదని భాష్యకారులును, అందు బాలకాండముచే శ్రీమచ్ఛబ్దార్థము చెప్పంబడునని అయోధ్యాకాండము కల్యాణగుణములను నుపవర్ణించుటంబట్టి నారాయణశబ్దార్థమును, ఆరణ్యకాండముచేత 'తేతం సోమమివోద్యన్తమ్' ఇత్యా దులచే దివ్యమంగళవిగ్రహమును వర్ణించుటంబట్టి చరణశబ్దార్థమును, కిష్కింధా కాండ సుందర కాండములచే శరణశబ్దార్థమును, యుద్ధకాండముచే ప్రపద్యే అను దానియర్థమును, ఉత్తర కాండముచే ముక్తిఫలమును గీర్తించుటంబట్టి ఉత్తరఖం డార్థమును జెప్పంబడినవి.

(15) ఈయధికారికి సదా జపింపందగినది రామాయణమే యని తెలుపు టకై గాయత్ర్యర్థమిందు ప్రతిపాదింపంబడుచున్నది. ఎట్లన బాలకాండమందు వేదప్రసిద్ధమగు జగత్ప్రసూతికి హేతుభూతమయిన భగవత్స్వరూపమును వర్ణిం చుటవలన సవితృశబ్దార్థమును, అయోధ్యాకాండ కిష్కింధాకాండములయందు గుణగణములను వర్ణించుటంబట్టి వరేణ్యశబ్దార్థమును, అరణ్యకాండమందు తేజో మయ మైనశరీరమును వర్ణించుటంబట్టి భర్గశబ్దార్థమును, సుందరకాండమున దివ్య మంగళవిగ్రహాలతుణములను వర్ణించుటంబట్టి దేవశబ్దార్థమును యుద్ధకాండమున శరణాగతినిజెప్పుటచే ధీమహిశబ్దార్థమును, ఉత్తరకాండమున ముక్తిఫలమును గీర్తించుటవలన తృతీయపాదార్థమును బ్రతిపాదింపంబడినవి.

(16) 'ఈయధికారి చార్వాకబౌద్ధాదిదర్శనములు మొదలుగాంగల యన్య చ్ఛాస్త్రములను ముట్టనుగూడ ముట్టరాదు' అని జాబాలి లక్ష్మణ వచనములు వానికి రాముండు గావించిన ఖండనములు మొదలగువానిచే నిర్ణయింపం బడు చున్నది.

(17) మహాత్ములకును వ్యసనము గలుగుచున్నది. కావున సంసారమును వదలవలయుననెడియాస గలిగి యుండవలయునని వైరాగ్యమును బొందుటకై నాగ పాశ, బ్రహ్మాస్త్రబంధ, సీతాపహరణ, రాజ్యభ్రంశాదులచే వ్యక్తముగాఁ జెప్పఁ బడినది.

(18) లోకవ్యవహారమునకు నుపకరించు చతుష్షష్టికళల యర్థముగూడ సంగ్రహ ముగా నిందుఁ బ్రతిపాదింపఁబడుచున్నది: 'యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్', 'ఇందుఁగలది తక్కినచోటనుండును; ఇందు లేనిదియెందును లేదు' అను న్యాయమున చతుష్షష్టి కళలు నిందు ప్రతిపాదింపఁబడుచున్నవి ఎట్లన, ప్రతి పాదితమయినదిశను వేదార్థము తెలుపఁబడెను. హనుమంతుని వచనములను శ్లాఘించునపుడు 'అనయాచిత్రయావాచా త్రిస్థానవ్యఞ్జనస్థయా' ఇత్యాదులచే శిక్షార్థమును అశ్వమేధాదిప్రకరణమున కల్పసూత్రార్థమును 'నూనంవ్యాకరణం కృత్స్నమనేనబహుధాశ్రుతమ్' ఇత్యాదులచే వ్యాకరణార్థమును ఇట్లే తక్కిన వన్నియు నిందు సూక్ష్మబుద్ధిని గ్రహించునది.

ఇట్లు లిపదునెనిమిదియర్థములు ఆచార్యులచే నుపదేశింపఁబడినవి.

శ్రీరామాయణసంప్రదాయార్థసంగ్రహము.

సమాప్తము.

శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే నమః.

# విషయసూచిక

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# విషయసూచిక

వానరవీరులు కుంభకర్ణున కోడుట; అంగదుండును పరాజయము నొందుట; సుగ్రీవుండు కుంభకర్ణునితో యుద్ధము సేయుట; మూర్ఛితుండగు సుగ్రీవుని గుంభకర్ణుండు లంకకుం గొనిపోవంగా, లంకారాజవీధియందలి శైత్యోపచారముల చే నతండు మూర్ఛ దేఱి, కుంభకర్ణునిముక్కును, చెవులను గొఱికి తీసికొని మరల వానరసేనం గలయుట; కుంభకర్ణుండు ముక్కుసెవులు పోయినందులకు లజ్జితుండై, కోపమున మరల యుద్ధమునకు వచ్చుట; రామ కుంభకర్ణ యుద్ధము; రామునిచే కుంభకర్ణుండు హతుం డగుట.

మహాకాయు లగు సవ్వానరులు, అంగదుని మాటలు విని, యపుడు మరణంబునకును దెగించిన బుద్ధిగలిగి యందఱును యుద్ధముం గోరి మరలివచ్చిరి అంగదుం డట్లు తగినమాటలచే మరల్చి నిలువరింపంగా, అవ్వానరులు తమ తొలి పరాక్రమముల నుగ్గడించుకొనుచు, పరాక్రమము నవలంబించి, జీవించు నాశ లేమిచేత, మరణము నొందినను నొందుదుముగాక యని నిశ్చయించి పార్శ్వంబున మరలివచ్చి, మిక్కిలి తుముల మగు యుద్ధము గావించిరి. అంత, మహాకాయు లగు వానరవీరులు వృక్షములను మిక్కిలియు గొప్ప లయిన పర్వతములను నెత్తికొని శీఘ్రంబునం గుంభకర్ణునిపయికిం దఱిమివచ్చిరి. మహాకాయుం డగు నా కుంభకర్ణుండు వీర్యవంతుండుగావున, మిక్కిలియుం గ్రుద్ధుండై గద నెత్తికొని, శత్రువుల నలుగడల నలంచి కలంచి నేలం గూల్చెను. కుంభకర్ణుని యొక్కొక దెబ్బకును వానరులు హింసితులై యావయవములు వికావికలై ఏడునూర్లు ఎనిమిదినూర్లు వేలునుగా నేలం గూలిరి. ఆ కుంభకర్ణుండు మిక్కిలియుం గుపితుండై, గరుడుండు సర్పంబులను దినునట్లు, వానరులను ఎనమండ్రను పదుగురను పదునార్గురను ఇరువదిమందిని ముప్పదుగురనుంగాం జేతులం బట్టుకొని నోట వేసికొని భక్షించుచు యుద్ధరంగమున విహరించుచుండెను. అంత, వానరులు నెట్టకేలకు దిటవొంది, యందఱు నంతనంతి నొకటిగాం జేరి వృక్షములను బర్వతములనుం బట్టుకొని సన్నద్ధు లయి యుద్ధాగ్రమున నిలిచిరి. అంత, వానరసింహుండగు ద్వివిదుండు, ఒక పర్వతమును బెకలించుకొని పర్వతశిఖరమువలె మిక్కిలి పొడవయిన కుంభకర్ణునిపయి, నేలకు వ్రాలునట్లు మిక్కిలియు వంగియున్న మేఘమువలె, పయి నడరెను. ద్వివిదుండు కుంభకర్ణుని సమీపమునకుం బోయి, యా పర్వతము నతనిపయి నైచెను. అది గుఱితప్పి మహాకాయుం డగు నతనిపయిం బడక యపు డతని సేనపయిం బడెను. ఆ మేటిపర్వత మా సేనయందలి గుఱ్ఱముల నేనుంగులను రథములను ప్రసిద్ధు లయిన తక్కిన రాక్షసులనుం జూర్ణము గావించెను. అంత,

నా ద్వివిదుఁడు మఱియొక పర్వతశిఖరమును వైచెను. ఆ పర్వతశిఖరమును చేతను గొట్టువడి గుఱ్ఱములును హతము లగుటంజేసి, ఆ రాక్షసయుద్ధభూమి యందంతట నెత్తురు వెల్లువ లయినవి రాక్షసరథికులును భయంకరముగా సింహనాదములు సేయుచు, ప్రళయకాలాంతకునిఁ బోని బాణము లేసి, గర్జించుచున్న వానరోత్తముల శిరములు వేగ తునుమాడిరి. మహాబలశాలు లగు వానరులును, అప్పుడు గొప్ప గొప్ప వృక్షములను బెకలించుకొని, వానిచే రథములను నుగ్గునుచ్చ గావించి, గుఱ్ఱములను ఏనుంగులను లొట్టియలనును రాక్షసులను రూపుమాపిరి. హనుమంతుఁ డాకాశగతుండై, పర్వతశిఖరములను పలువిధము లయిన పెక్కు-వృక్షములనును కుంభకర్ణుని తలపయి వర్షించెను. మహాబలుం డగు నా కుంభకర్ణుఁడు, శూలమున నా పర్వతశిఖరములను ఛేదించి వర్షముగాఁ గురియుచున్న యా వృక్షముల నెల్లఁ దట్టివేసెను. అంత నా కుంభకర్ణుఁడు, వాఁడిశూలముఁగొని యుగ్రమయిన యా వానరసైన్యమును దఱుమఁగా, నప్పుడు హనుమంతుఁడు పర్వతశిఖరము నొకదానిం బెకల్చుకొని యాతని ముందట నడ్డపడి నిలిచెను పర్వతమువలె భయంకరమైన కాయము గలిగియున్న యా కుంభకర్ణుని హనుమంతుఁడు కుపితుఁడై, వేగ యా పర్వతశిఖరముచేఁ గొట్టెను ఆ పెట్టునకు కుంభకర్ణుఁడు గీడ్పడి మేదస్సును నెత్తురును గాఱి దేహ మంతయుఁ దడియ, నపుడు కొంచెము క్షోభము నొందెను. ఆ కుంభకర్ణుఁడు మెఱపువలె మెఱయుచు, మండుచున్న యుగ్రశిఖరముతోఁ గూడిన కొండవలె వెలుంగుచున్న శూలమును గిరగిరం ద్రిప్పి, కుమారస్వామి తన యుగ్రశక్తిచే క్రౌంచపర్వతమును భేదించునట్లు, హనుమంతుని వక్షఃస్థలమునఁ గొట్టెను. అట్లు హనుమంతుఁడు, శూలముచే విశాల మగు తన వక్షము భిన్నముకాఁగా, మూర్ఛిల్లుచు నోట నెత్తురు గ్రక్కుచు, మహాయుద్ధరంగంబున ప్రళయకాల మేఘధ్వనిఁబోని భయంకరరవంబున నఱచెను. అంత, రాక్షససమూహములు హనుమంతుఁడు బాధితుఁడగుటను జూచి, తోడనే పరమసంతుష్టు లయి సింహనాదములు సేసిరి. వానరులందులకు వ్యథ నొంది కుంభకర్ణుని భయంబున నార్తులై, యుద్ధమునుండి పలాయితు లయిరి. అంత, బలవంతుఁ డగు నీలుఁడు, చెదరిన సేనను నిలువరించి, బుద్ధిమంతుఁ డగు కుంభకర్ణునిపై నొక పర్వతశిఖరమును వైచెను. అతం డా పర్వతశిఖరము తనపయికి వచ్చుటం జూచి దానిని బిడికిటం దట్టెను. అతని పిడికిటిపోటున ఆ పర్వతశిఖము పగిలి పఱియలై మిడుఁగుఱులు సెదర మంటలు పొడమ నేలం బడినది. ఋషభుఁడు శరభుఁడు నీలుఁడు గవాక్షుఁడు గంధమాదనుఁడు ననెడి యీ యేవురు వానరోత్తములును కుంభకర్ణునిపయికి నడరిరి. మహాబలు లగు నవ్వానరోత్తములు మహాకాయుని కుంభకర్ణునిం జుట్టుముట్టి, పర్వతంబులను వృక్షములను నఱచేతులను తన్న నెత్తిన పాదములను పిడికిళ్లనుం గొని చుట్టు

ముట్టిరి. ఆ దెబ్బ లన్నియు నతనికి సుఖస్పర్శములుగాఁ దోఁచినవి గాని, యెంత మాత్రమును వ్యథ పెట్టినవి గావు. కుంభకర్ణుఁ డపుడు మహావేగుం డగు ఋషభుని రెండుచేతుల బిగ్గఁ గౌఁగిలించి యదిమెను. భయంకరుం డగు నవ్వానరతిలకుఁడు ఋషభుఁడు కుంభకర్ణునిభుజములచేఁ బీడితుఁడై, నోట నెత్తురు గ్రక్కుచు నేలం బడెను. అప్పు డింద్రశత్రుండు కుంభకర్ణుఁడు యుద్ధంబున పిడికిటిపోటున శరభునిఁ గొట్టి మోఁకాల నీలుం గ్రుమ్మి యఱచేత గవాక్షుని జఱచెను. మిక్కిలి క్రుద్ధుఁడై బలముకొలఁదియు గంధమాదనుని పాదంబునం దన్నెను. అవ్వానరోత్తములు, కుంభకర్ణుఁడు గొట్టిన దెబ్బలకు మిక్కిలి బాధనొంది నెత్తురుం దోఁగి మూర్ఛ నొంది, నఱకంబడిన మోదుగుచెట్లుంబోలె నేలం బడిరి. మహాత్ము లగు నవ్వానరముఖ్యులు పడుటం జూచి, పెక్కువేల వానరులు కుంభకర్ణునిపయి కడరిరి. పర్వతాకారులును మహాబలులు నగు నవ్వానరవీరు లందఱును, కొండపైకిం బోలె నా కుంభకర్ణునిపయి కెగిరి యారోహించి, దంతములం బట్టి కొఱికిరి. ఆ వానరోత్తము లు మహాకాయుఁ డగు నా కుంభకర్ణుని నపుడు నఖంబుల గీఱిరి; పండ్లం గొఱికిరి; పిడికిళ్లం బొడిచిరి; మోఁకాళ్లం గ్రుమ్మిరి. పర్వతాకారుఁ డగు నా రాక్షససింహుఁడు కుంభకర్ణుఁడు, ఇట్లు వేలకొలఁది వానరులు తనపయిని వ్యాపించి యలమియుండఁగా, వృక్షములు పెరిఁగియున్న పర్వతమువలెఁ బ్రకాశించెను. మిక్కిలియు బలవంతుఁడు గాన, యా కుంభకర్ణుఁడు గరుడుఁడు సర్పములను భక్షించునట్లు, వానరుల నందఱను జేతులం బట్టికొని భక్షింప నారంభించెను. అట్లు కుంభకర్ణుఁడు వానరులను పాతాళబిలమువలె నున్న తన నోట వేసికొనఁగానే, వారలు ముక్కురంధ్రములనుండియు, చెవులనుండియు వెడలి వచ్చుచుండిరి. పర్వతాకారుఁ డగు నా రాక్షసోత్తముఁడు, ఇట్లు వానరులు మరలి వెడలివచ్చుటం జూచి, మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై, వారల నందఱను విఱిచి భక్షింపసాగెను. ఆ రాక్షసుఁడు ప్రళయకాలాగ్నివలె రౌద్రాకారుఁడై, మైమఱచి భూమియంతయును రక్తమాంసములం దడుపుచు, వానరసైన్యములందు విహరించుచుండెను. వజ్రాయుధము దాల్చిన దేవేంద్రునివలెను, పాశము ధరించియుండు యమునిభంగిని శూలపాణి యగు మహాబలుఁడు కుంభకర్ణుఁడు యుద్ధమున నెంతయుం బ్రకాశించెను. అగ్ని వేసంగికాలమున నెండియున్న యడవులను దహించునట్లు, కుంభకర్ణుఁడు వానరసైన్యములను దహించెను. అంత, నవ్వానరులు అట్లు వధింపఁబడుచు గుంపులు వీడి నాయకుఁడు లేకుండుటంజేసి, మిక్కిలియు భీతులయి, మహావికృతధ్వనిగా నఱవసాగిరి. అట్లు కుంభకర్ణుఁ డనేక విధముల వధించుచుండఁగా, అవ్వానరులు బాధితులై మనంబుల దుఃఖితులగుచు రాఘవుని శరణుఁజొచ్చిరి. అంత, నింద్రుని మనుమఁ డగు నంగదుఁడు యుద్ధమున వానరు లందఱును బరాజితులై పాఱుటం జూచి యొక గొప్ప పర్వత

శిఖరమును గొని కుంభకర్ణుని వెంబడివచ్చు రాక్షసు లందఱును భయపడునట్లుగా, మాటిమాటికిని సింహనాదములు సేయుచు, మహాయుద్ధంబున వేగ కుంభకర్ణుని పయి నడరి యాశిఖరమును కుంభకర్ణుని తలపయి వైచెను. అట్లు తలపై గొప్ప దెబ్బ తగులఁగా, ఆ కుంభకర్ణుఁ డప్పుడు మహాకోపమున మండిపడెను. ఆ కుంభకర్ణుఁ డట్లు కుపితుఁడై, సమస్తవానరులును భయపడునట్లు మహాధ్వనిగా నార్చుచు, వేగంబున నంగదుని మీఁదికిఁ బోయెను. మహాబలుఁ డగు నా కుంభకర్ణుఁడు కోపమున నంగదునిపై శూలమును వైచెను. యుద్ధమార్గములం జక్కఁగాఁ దెలిసినవాఁడును బలవంతుఁడు నగు నంగదుఁడు, ఆ శూలము తన పయికి వచ్చుటం జూచి, లాఘవంబునఁ దప్పించుకొనెను. ఆ యంగదుఁ డంతేకాక, తటాలున దగ్గఱకు దుమికి, కుంభకర్ణుని ఱొమ్ముపై నఱచేత నడఁచెను. పర్వతాకారుఁ డగు నా కుంభకర్ణుఁడు, అంగదుని దెబ్బకుఁ బరమకుపితుఁడై యేమియుఁ దెలియక మూర్ఛిల్లెను. అంత, నా బలవంతుఁడు కొంతవడికి మూర్ఛదేఱి తెలివి నొంది పిడికిలిం ద్రిప్పి యెడచేత నంగదునిం బొడిచెను. అంత నంగదుఁడు మూర్ఛిల్లి నేలం బడెను. వానరోత్తముఁ డగు నాయంగదుఁడు అట్లు మూర్ఛిల్లఁగానే, కుంభకర్ణుఁ డాశూలముగొని సుగ్రీవునిమీఁదికిఁ బోయెను. అప్పుడు వీరుఁడగు నా వానరాధిపుఁడు సుగ్రీవుఁడు మహాబలుం డగు కుంభకర్ణుఁడు తనమీఁదికి వచ్చుటం జూచి యుద్ధోత్సాహంబున గంతువేసెను. మహాకపి యగు సుగ్రీవుఁడు, పర్వతశిఖరమును జేత నెత్తికొని గిరగిరం ద్రిప్పుచు, వేగమున మహాబలుం డగు కుంభకర్ణునిమీఁది కడరెను. కుంభకర్ణుఁడు, ఆ సుగ్రీవుఁడు తనపయికి వచ్చుటను జూచి, సమస్తావయవములును వికృతముగా నుంచుకొని, సుగ్రీవున కభిముఖుఁడై నిలిచెను. వానరులను భక్షించుచు వారి రక్తముచేత నంగము లెల్లఁ దడియ, నిలుచున్న కుంభకర్ణుని సుగ్రీవుఁడు చూచి 'నీవు యుద్ధంబున గొప్ప గొప్ప వీరులను బడఁగూల్చితివి. ఇతరుల కెవ్వరికిని జేయ నలవిగాని కార్యము గావించితివి. వానరసైన్యములను భక్షించితివి. గొప్పయశస్సును బొందితివి. రాక్షసా! ఆ వానరసమూహములను వదలుము. అల్పులతో నీ కేమిపని? ఇటు రమ్ము. నే నీ పర్వతమును నిదె నీ పయిఁ బడవైచుచున్నాను. ఈ యొక్క పాటును మాత్రము సహింపుము' అనెను. వానరరాజగు సుగ్రీవుండు బలంబును ధైర్యమును వెనంగొనఁ జెప్పిన యప్పలుకు విని, రాక్షససింహుఁ డగు కుంభకర్ణుఁ డతనితో * 'నీవు బ్రహ్మదేవుని మనుమఁడవు. బ్రహ్మపుత్రుఁ డగు

* 'ప్రజాపతేస్తు పౌత్రః' అని మూలము. తొల్లి బ్రహ్మ యావులింపఁగా, అతనిముఖమునుండి, ఋక్షరజుఁ డనువానరుఁడు పుట్టెను. అతఁ డొకప్పుడు గ్రుమ్మరుచుండి, బ్రహ్మలోకమునందు అప్సరసరూపమును గలిగించు నొకానొక సరస్సున మునిఁగి యప్సరోరూపము నొందెను. అబిడను జూచి యింద్రుఁడును సూర్యుఁడును కామమోహితులై, యిరువురు నేకకాలమున దానిని, చేరం బట్టి

ఋక్షరజుని పుత్త్రుఁడవు. ప్రఖ్యాతి కెక్కిన పరాక్రమసంపత్తి గలవాఁడవు. ఇవన్నియు మాకుఁ దెలిసినవే నీ వేల గర్జించెదవు?' అనెను. అంత సుగ్రీవుఁడు, కుంభకర్ణుఁ డాడిన మాట విని, వజ్రంబును బిడుగునుం బోని యా పర్వతమును గిరగిరం ద్రిప్పి వేగవైచి యతని వక్షమునఁ బడఁగొట్టెను అప్పు డా పర్వతశిఖరము విశాలంబగు కుంభకర్ణుని వక్షఃస్థలమునంబడి చూర్ణమయినది దానింజూచి, వానరు లందఱును తోడనే విషాదము నొందిరి. రాక్షససమూహములును సంతోషమున సింహనాదములు గావించెను. పర్వతశిఖరముచేఁ గొట్టుబడినందులకై యా కుంభకర్ణునకుఁ గోపము పుట్టెను. అతఁ డా కోపమువలన నోరు దెఱచి యార్చుచు, మెఱువువలె మెఱయుచున్న శూలమును గిరగిరం ద్రిప్పి సుగ్రీవుని వధించుటకుఁ గాను నతనిపై వైచెను. హనుమంతుఁడు తత్క్షణమే యచ్చటి కుఱికి, కుంభకర్ణుఁడు భుజబలముకొలఁదియు విసరివైచిన యా వాఁడిశూలమును బంగారు దండతోడం గూడినదానిని నొడిసి పట్టుకొని వేగంబున రెండుచేతులం బట్టి విఱిచెను. వానరసింహుఁ డగు హనుమంతుఁడు మిక్కిలి సంతుష్టుఁడై, వేయి బారువుల యినుముతోఁ జేయఁబడిన యమ్మహాశూలమును మోఁకాలి కానించి ప్రల్లన విఱిచివేసెను. హనుమంతునిచేత శూలము విఱుగుటం జూచి, వానర సైనికు లుబ్బున పలువిధముల నార్చుచు, నలుప్రక్కలను బఱతెంచిరి. అవ్వానరు లెల్ల ఆ శూల మట్లగుటను జూచి, మిక్కిలి సంతుష్టులై సింహనాదములు సేయుచు, వాయుకుమారుని హనుమంతునిం బూజించిరి. మహాబలుం డగు నా రాక్షసవీరుఁ డా కుంభకర్ణుఁడు, అపుడు తన శూలము విఱువఁబడుటను జూచి కుపితుఁడై, * లంకామలయపర్వతమునుండి శిఖరమును బెకలించి సుగ్రీవుని దారసించి దానిని వైచెను. ఆ పర్వతశిఖరపు దెబ్బకు, ఆ సుగ్రీవుఁడు మూర్ఛిల్లి

---

కొనిరి. అంతలో, వారలకు రేతస్సు కలఁగి యా చెలువపైఁ బడెను. అట్లు అది యా స్త్రీవాలమునం బడఁగా, వాలియనియు గ్రీవమునం బడఁగా సుగ్రీవుఁ డనియు నిరువురు కుమారులు పుట్టిరి. బ్రహ్మ యీ సంగతిం జూచి నవ్వి అప్సరసయైన ఋక్షరజుని వెప్పటిరూపము నొందుటకై పిలుచుకొని యా కుమారులనుం దోడ్కొనిపోయి వానరరూపమును గలిగించు మఱియొక సరస్సున మునుంగు మని చెప్పఁగా, నది యట్లు చేసి కుమారులును దానును వానరరూపములను దాల్చెను. అతని పుత్త్రులు వాలిసుగ్రీవులు గావున, సుగ్రీవుఁడు బ్రహ్మమనుమఁడుగా నిట చెప్పఁబడెను. కశ్యప ప్రజాపతివలన సూర్యుఁడును, సూర్యునివలన సుగ్రీవుఁడును బుట్టుటచే, ప్రజాపతిపౌత్త్రుఁ డనఁ బడె నని మఱికొందఱ మతము—గోవిందరాజులు.

* త్రికూటశిఖరముపయి నున్న లంకయొక్క ద్వారమునం దుండు కుంభకర్ణుఁడు మఱియొక చోట నుండు లంకా మలయపర్వతపు శృంగము నెట్లు పెకల్చినాఁ డన్నచో, నంతకుఁ దగినకొలఁది యగు పెనుదేహము గలవాఁడుగాన, యట్లు చేసె ననికాని, లంకామలయ మనఁగా నిట త్రికూట మనికాని గ్రహించునది.

యుద్ధభూమిని బడెను. అతఁడట్లు తెలివిదప్పి నేలం బడుటను జూచి, యనంత రాక్షసు లందఱును మిక్కిలి సంతుష్టులై సింహనాదములు గావించిరి. వానరులు మిక్కిలియు దుఃఖితులైరి. ఆ కుంభకర్ణుఁడు, యుద్ధమున ఆశ్చర్యమును భయంకరమును నగు పరాక్రమముగల వానరనాథుని సుగ్రీవుని యెత్తుకొని పోయి, మిక్కిలి ప్రచండమైన వాయువు మేఘమును గొనిపోవునట్లు, అతనిని బట్టికొని పోయెను. మేరుపర్వతాకారుఁడగు నా కుంభకర్ణుఁడు, యుద్ధమున మహామేఘముం బోని యా సుగ్రీవు నెత్తికొని పోవుచు, ఉన్నతమగుచున భయంకరశిఖరము గల మేరుపర్వతమువలెఁ బ్రకాశించెను. అంత, వీరుం డగు కుంభకర్ణుఁడు అట్లు సుగ్రీవు నెత్తికొని, యుద్ధమున రాక్షసశ్రేష్ఠులు పలువిధములఁ బొగడఁగా, వానరరాజగు సుగ్రీవుండునుం బట్టువడుటకు దేవత లాశ్చర్యము నొందిచేయు ధ్వనులను వినుచుం బోయెను. అంత, నప్పుడు దేవేంద్రునికిం బలుపరాక్రమము గల యా యింద్రశత్రువు కుంభకర్ణుఁడు, దేవేంద్రసమానుఁడగు నా వానరేంద్రుని సుగ్రీవు నెత్తికొని 'వీనిని బట్టుకొని పోయితిమేని, రామలక్ష్మణులతోఁ గూడిన యీ వానరసైన్యము నంతటిని బట్టుకొన్నట్లె యగు' నని తలఁచెను. అంత, వానరసైన్య మంతయు నంతంతఁ బాఱుటయు, సుగ్రీవుండును కుంభకర్ణునిచేతఁ బట్టువడుటయుఁ జూచి, వాయుపుత్రుం డగు హనుమంతుఁడు బుద్ధిమంతుఁడుగావునఁ, దనలో 'సుగ్రీవుఁడే యిట్లు పట్టువడెనే! ఇఁక నను బోఁటికి నేమి చేయ నగును. దేనిని నాకుఁ జేయుట న్యాయ్యమో దానినే యెప్పుడును జేయుదునుగాని యొండు గావింపను. నేను పర్వతమంతటివాఁడనై రాక్షసుని నాశముసేసెదను. నేను యుద్ధమున మహాబలుఁ డగు కుంభకర్ణునిఁ బిడికిటం బొడిచి, దేహమును వికవికలు గావించి వధించి వానరరాజును విడిపింపఁగా, సమస్తవానరులును సంతోషము నొందుదురుగాక. అట్లు గాక! ఈ రాజు సుగ్రీవుఁడు తన్ను దేవతలును, అసురులును, ఉరగులును నొక్కటిగనై వచ్చి పట్టుకొన్నను, తానే విడిపించుకొననుగూడ సమర్థుఁడు. వానరనాథుఁ డితఁడు యుద్ధమున కుంభకర్ణుండు వైచిన పర్వతపుదెబ్బ దగిలియున్నందున, ఇంతకు తన్నుఁ దాను దెలియకున్నాఁడని తోఁచుచున్నది. లేకున్న, తానే విడిపించుకొని యుండునే! ఈ సుగ్రీవుఁ డీకొంతసేపటిలో మూర్ఛదేఱి, యిమ్మహాయుద్ధమునందుఁ దమకును వానరులకును నేది హితమో దానిని జేయును. స్వామి కష్టమునం దగులఁగా భృత్యుఁడు విడిపింపవచ్చునుగాని, యట్లు నే నీసుగ్రీవుని విడిపింతునేని, మహా పరాక్రమశాలి యగు నితనికిఁ గలుగు ననంతుష్టి మిక్కిలి కష్టముగా నుండును. కీర్తియు శాశ్వతముగా నశించును. అందువలన నేను గొంతసేపు, మన రాజే పరాక్రమించుటను వేచియుండెదను; అతని పరాక్రమముమీఁదనే భారమువైచి యుండెదను. అతఁడు వచ్చువఱకును విచ్చి



1495. కుంభకర్ణుఁడు సుగ్రీవుని పట్టుకొనుట; సుగ్రీవుఁడు కుంభకర్ణుని ముక్కు చెవులను కొఱికివైచుట.

పాఱెడు వానరసమూహముల నాశ్వాసించు చుండెదను' అని యాలోచించెను. ఇట్లు వాయుపుత్త్రుఁడు హనుమంతుఁడు చింతించి, యవ్వానరమహాసైన్యమును బాఱిపోనీయక, మరల నిలిపినవాఁ డయ్యె. అంత నా కుంభకర్ణుఁడు, ఇట్టట్టు కదలుచున్న యమ్మహాకపిని సుగ్రీవుని నెత్తికొని, మేడలమీఁదను, చర్యాగృహములందును, గోపురములందును నున్న రాక్షసులు శ్లాఘ్యము లగు పుష్పవర్షములను గురియుచుండఁగా, లంకాపురమును బ్రవేశించెను మహాబలుండగు సుగ్రీవుఁడు, అట్లు తనపై లాజలును సుగంధజలములును జనిగొని పడఁగాఁ దడియు చుండుటవలనను, రాజమార్గము చల్లఁగా నుండుటవలనను మెల్లమెల్లఁగా మూర్ఛదేఱెను అంత, మహాధీరుం డగు సుగ్రీవుఁడు, మిక్కిలికష్టమునఁ దెలి వొంది, యధికబలవంతుఁ డగు నా కుంభకర్ణుని వక్షమునుండి పలుమాఱు లంకాపురపు రాజమార్గముం జూచుచుఁ దనలో 'ఇప్పు డిట్లు పట్టువడియున్నానే! నే నిప్పుడు ప్రతీకార మెట్లు చేయఁగూడును? వానరుల కెట్లు చేసిన నిష్టమును హితమునుగా నుండునో, యాలాగునఁ గార్యము గావించెదను.' అని యాలోచించెను. అంత, వానరరా జగు సుగ్రీవుఁడు వాఁడిగోళ్లచే తీక్ష్ణ లున నింద్రశత్త్రుఁ డగు కుంభకర్ణుని చెవులను గిల్లి, పండ్లతో ముక్కు కొఱికికొని, పార్శ్వము లందు చెక్కులను మూఁపులను కడుపుప్రక్కలను పాదములచే విదారించెను. ఆ కుంభకర్ణుఁ డట్లు సుగ్రీవునిచే ముక్కును జెవులును బోయి, ప్రక్కల విదారింపఁబడి నలంగుచుపడుటను మిక్కిలియుం గోపావేశము నొంది, దేహ మంతయు నెత్తురు గాఱ, సుగ్రీవుని గిరగిరఁ ద్రిప్పి, నేలపయి వేసి నలిపెను. భయంకరబలుఁ డగు కుంభకర్ణుఁడు నేలపైవైచి పిండిలివండుగాఁ బిసికినను, ఆ రాక్షసులు నానావిధములఁ బ్రహరించుచుండినను, ఆ సుగ్రీవుఁడు సరకుసేయక వేగమున నాకాశమున కెగసి, మరల రామునితో వచ్చిచేరుకొనెను. మహాబలుఁ డగు కుంభకర్ణుఁడు ముక్కుచెవులును బోయి, నెత్తుటం దోఁగుచు సెలయేళ్లతోఁగూడిన పర్వతము వలెఁ జూడ నొప్పెను. అట్లు నెత్తుటం దోఁగుచున్న మహాకాయుఁడును భయంకర పరాక్రముఁడును మహాబలుండు నగు నా కుంభకర్ణుఁడు మరల యుద్ధభూమికిట్టు దిరిగి, యుద్ధముసేయ నిశ్చయించెను నల్లని కాటుకరాశివలెఁ జూపట్టు నా కుంభకర్ణుఁడు, కోపంబు మీఱ దేహ మంతయు రక్తము గాఱుటం జేసి, సంధ్యాకాలము నందలి మేఘమువలె నప్పుడు ప్రకాశించెను. ఆ సుగ్రీవుఁడు తప్పించుకొనిపోయి నంత నే, దేవేంద్రశత్త్రుం డగు కుంభకర్ణుఁడు క్రుద్ధుఁడై రౌద్రాకారమున మరల యుద్ధమునకుఁ బరుగెత్తుచు, ఆయుధము లేదని తలంచి, యప్పుడు భయంకరమైన యొక్క ముద్గరము గయికొనెను. అంత, మహాతేజుం డా కుంభకర్ణుఁడు శీఘ్రముగా పట్టణముననుండి వెలువడి, యుగ్ర మగు నవ్వానరసైన్యమునుజొచ్చి, జ్వలించుచున్న ప్రళయకాలాగ్నిహోత్త్రుండు ప్రజలనుంబోలె, యుద్ధమున

నా సైన్యమును భక్షింపసాగెను. కుంభకర్ణుఁడు యుద్ధమున, సుగ్రీవుని స వానరసైన్యమును జొచ్చి, ఒంటరిచే రక్తమాంసములందు పేరాసగొని మోహమున తనవారెవరెవరని తెలియక, రాక్షసులను వానరులను పిశాచములను భల్లూకములను భక్షించెను. ప్రళయకాలమున మృత్యువు ప్రజలను హరించునట్లు, ఆ కుంభకర్ణుఁడు మేటివానరులను బట్టి భక్షించెను. అతఁడు క్రుద్ధుఁడై వానరులను రాక్షసులనును బట్టి, యేకకాలమున ఒకరి, నిద్దఱను, ముగ్గురను, అనేకులను, ఒకచేత నెత్తి వేగమున నోట వేసికొనుచుండెను. అప్పుడు, అతఁడు మహాబలుఁడు గాన, వానరులు మేటిపర్వతశిఖరములచే నెంతగాఁ గొట్టుచున్నను, నా దెబ్బలను సరకుసేయక, తాను దిన్నట్టి వానరుల మేదస్సును నెత్తురును తన దాఁడలనుండి వెల్లువలుగాఁ గాఱ, వారిని బట్టి భక్షించుచుండెను. అట్లు కుంభకర్ణుఁడు పట్టి భక్షించుచుండఁగా, ఆ వానరులు నిలువలేక రాముని శరణుఁ జొచ్చిరి. కుంభకర్ణుఁడును మిక్కిలియు క్రుద్ధుఁడై, వానరులను భక్షించుచునే వారి వెంటంబడి పరుగెత్తెను. అతఁడు వానరులను ఏడువందలను, ఎనిమిదివందలను, ఇరువదివందలను, ముప్పదివందలనుఁగా రెండుచేతులచేతను బిగియ నదుముకొని భక్షించుచునే పరుగునఁ దఱుముచుండెను. అప్పుడు శత్రుబలంబుల నుఱుమాడుచు, వారి పట్టణముల జయించువాఁడగు సుమిత్రాపుత్రుఁడు లక్ష్మణుఁడు, కుపితుఁడై, యుద్ధము గావించెను. వీర్యవంతుఁడగు నా లక్ష్మణుఁడు కుంభకర్ణుని దేహమునం దేడుబాణములు నాటించి, మరలఁ బెక్కుబాణములు దీసి విడిచెను. కుంభకర్ణుఁడు మహాబలుఁడు గాన, సరకుసేయక లక్ష్మణునిఁ దలకడచి, పదఘాతమున భూమి పగులునట్లు దొరఁగఁగా, రామునిమీఁదికే పోయెను. అంత, దశరథకుమారుఁడగు రాముఁడు బెడిదమైన యస్త్రము నొకదాని సంధించి తీక్ష్ణములగు బాణములను కుంభకర్ణుని ఱొమ్ము గాఁడ నేసెను. అట్లు రామునిబాణములు గ్రుచ్చుకొనఁగా, క్రుద్ధుఁడై తోడింబడి రామునిపైఁ బరుగెత్తివచ్చుచున్న యా కుంభకర్ణుని నోటనుండి నిప్పువంటి జ్వాలలు వెడలినవి. ఆ రాక్షసపుంగవుఁడు, అట్లు రాముని యస్త్రముచేఁ గొట్టుపడి పరమక్రుద్ధుఁడై, యుద్ధమున వానరులు భయముగొని పాఱ, భయంకరముగా సింహనాదము సేయుచు రాముని కెదురై పాఱుతెంచెను. రాముఁడు నెమిలిపురులు గట్టంబడియున్న బాణములను కుంభకర్ణుని ఱొమ్మున నుచ్చిపోవ వేయఁగా, నతండు పరవశుం డగుటయు, నతనిచేత నుండి మహాగదయు జాఱి నేలంబడెను. అతని ఖడ్గాద్యాయుధములును అన్నియు నేఁబడి చెల్లాచెదరైనవి. అంత మహాబలుఁడగు నా కుంభకర్ణుఁడు తాను నిరాయుధుం డగుటను దెలిసికొని పిడికిళ్లచేతను, గాళ్లచేతను మహాయుద్ధము గావించెను. అట్లు బాణములు మిక్కిలియు మేనం గ్రుచ్చుకొన నెత్తుటఁ దొప్పదోఁగియున్న యా కుంభకర్ణుఁడు, పర్వతము సెలయేటిని స్రవించునట్లు రక్తమును స్రవిం

చెను. అతఁడు దేహ మంతయు నెత్తురు వ్యాపించియుండఁగా, తీవ్రకోపమునొంది, వానరులను, రాక్షసులను, భల్లూకములనును భక్షించుచు యుద్ధరంగమునందుఁ గ్రుమ్మరుచుండెను. అంత భయంకర పరాక్రమంబు గలిగి మృత్యువుంబోలియున్న యమ్మహాబలుఁడు కుంభకర్ణుఁడు, బెడిదమైన యొకపర్వతశిఖరము నెత్తి గిరగిరం ద్రిప్పి, రాముని గుఱిపెట్టి వేసెను. పురుషసింహుఁడగు రాముఁడు ఆ పర్వత శిఖరము తనపయికి రాకమునుపే, నడుమనే, కాంచనముచే చిత్రముగా నలంకృతములై సూటిదక్వక సాఁగుబాణము లేడు వైచి ఖండించెను. మేరుశిఖరమువలెనాకారము చూపట్టు నా కుంభకర్ణుఁడు కాంతిచే జ్వలించుచున్నట్లు తేజరిల్లుచు, రెండువందల మేటివానరులపయి కడరుటం జూచి, రాముఁ డతనిని బాణములు వైచి నేలం బడునట్లు గావించెను. ఆ సమయమున ధర్మాత్ముఁ డగు నా లక్ష్మణుఁడు కుంభకర్ణుని వధంబునకై యాసక్తిఁగొని, యందులకు నుపాయములు పెక్కాలోచించుచు, రామునితో 'రాజా! ఈ కుంభకర్ణుండు నెత్తురు వాసనగొని మత్తుఁడై యున్నాఁడు గాన, వానరు లని కాని రాక్షసు లని కాని తెలియఁడు. తనవారలను నెదిరివారలనుగూడఁ బట్టి తినుచున్నాఁడు. వానరతిలకు లందఱును నీ కుంభకర్ణునిపై చక్కఁగా నెక్కి నిలుతురుగాక! ముఖ్యులయిన యూథపతులును, యథాయోగ్యముగా నితనిచుట్టు నుండి కదలమెదలనీకుండఁ గావింతురుగాక! ఇప్పు డట్లు గావించినయెడల, దుర్బుద్ధి యగు వీఁడు, పెనుభారముచే పీడితుఁడై కాలమున నేలం బడుటయేకాక, యా బరువున మరల లేవలేనివాఁడై యింకఁ దక్కిన వానరులను జంపకుండును' అనెను. బుద్ధిమంతుఁ డగు నా రాజకుమారుఁడు లక్ష్మణుఁడు చెప్పిన యప్పలుకులు విని, అవ్వానరులు సంతుష్టులయి కుంభకర్ణు నారోహించిరి. కుంభకర్ణుఁ డట్లు వానరులు తనపై నెక్కఁగా, మిక్కిలియుఁ గ్రుద్ధుఁడై, వేగంబున దుష్టగజము మావటివాండ్రను విదుల్చునట్లు, అవ్వానరుల నందఱను విదిల్చివైచెను. రాముఁ డట్లా వానరు లందఱును విదుల్పం బడుటను జూచి, ఆ రాక్షసుఁడు దుష్టుఁడుగాన వధింపఁ దలఁచి వేగమున మేలయిన వింటిని దీసికొని యతనిమీఁదికిఁ బోయెను. వీరుఁ డా రాముఁడు కోపమున కన్నెఱ్ఱఁబాఱ, చూడ్కులఁ గాల్చునట్లు చుఱచుఱం జూచుచు, వేగము మీఱ కుంభకర్ణభయమునఁ గంది కుంది యున్న వానరయూథపు లెల్ల సంతోషింప, రోషమున వానిమీఁది కడరెను. ఆ రాముఁడు మహాసర్పముంబోనిదై దృఢమయిన యల్లెత్రాడు గలిగి, బెడిదమై బంగారుచే వింతగా రంగారుచున్న వింటిని దీసికొని, మేలియమ్ములు గల పొదులను గట్టికొని వానరుల నాశ్వాసించి కుంభకర్ణునిమీఁదికి వేగ యడరెను. మిక్కిలియు దుర్జయుఁ డగు నమ్మహాబలుఁడు రాముఁడు, అవ్వానరసమూహములచేతను బరివృతుఁడై లక్ష్మణుఁడు వెంట రా యుద్ధమునకు వెడలెను. ఆ రాముఁడు, మహాకాయుఁడై కిరీటంబు దాల్చి సమస్తా

వయవములును నెత్తుటం దోఁగియున్న మహాబలుని, పగవారి పీఁచ మడంచు కుంభకర్ణునిం జూచెను. ఆ కుంభకర్ణుఁ డపుడు, కుపితమైన దిగ్గజమువలెఁ జిమ్మిరేఁగి కనఁబడినవారి నెల్లఁ దఱిమి కొట్టుచు, క్రుద్ధుండై వానరులను వెదకుచు రాక్షస పరివృతుఁడై యొప్పుచు, వింధ్యమందరపర్వతములవలెఁ జూపట్టుచు, బంగారు బాహుపురులు రంగార, మేఘము పొడవుననుండి వర్షము గురియునట్లు, నోట నుండి నెత్తురు గ్రక్కుచుండెను. మఱియు నతఁడు నాలుకచే నెత్తురు నాకికొనుచు, నెత్తుటివలె నెఱ్ఱనయిన కన్నులతో, వానరసేనను మర్దించుచుఁ బ్రళయ కాలమునఁ బ్రజల నాశముసేయు యమునివలెఁ జూపట్టుచుండెను. పురుషలలాముం డగు రాముఁ డపుడు, మండుచున్న యగ్నియుంబోలెఁ వెలుంగుచున్న రాక్షసోత్తముని కుంభకర్ణునిఁ జూచి వింటిని సారించెను. రాక్షససింహుఁ డగు కుంభకర్ణుఁడు, రాముని వింటిధ్వనిని విని, దాని కోర్వఁజాలక కుపితుఁడై రాముని పయికి వేగ దలపడెను. అంత, యుద్ధమునందు, వాయువుచే పయికి రేఁగిన పెను మేఘముం బోలినవాఁడై, వాసుకి మేటిశరీరమువలె నిడుదలై బలుచేతులు మీఱఁ బర్వతాకారమున నొప్పు కుంభకర్ణుఁడు, యుద్ధమునం దనపయికి వచ్చుచుండుటం జూచి రాముఁ డతనితో * 'రాక్షసాధిపా ! రమ్ము. విషాదము వలదు. నేను విల్లు చేపట్టి నిలిచియున్నాను, చూడుము. నీ వింద్రుని గెలిచినాఁడ నను కొందువు కాఁబోలు. నన్ను రాముఁ డని యెఱుఁగుము. ఇంద్రుఁడను గాను, ఇఁకఁ గొంతసేపులోపలనే యుసురు వీడెదవు చూడుము' అనెను కుంభకర్ణుఁడు 'ఇతఁడే రాముఁ' డని యెఱింగి వికృతస్వరముగా పకపక నవ్వుచు, మిక్కిలి క్రుద్ధుఁడై, యుద్ధంబున వానరు లందఱును బరుగువాఱ, సమస్తవానరుల గుండియలు పగుల్చునట్లు, రామునిమీఁదికిఁ దలపడెను మహాతేజుం డగు కుంభకర్ణుఁడు, వికృతముగాను, భయంకరముగాను, మేఘగర్జనమువలె గంభీరముగాను నవ్వి, రామునిం జూచి, 'నేను విరాధుఁడను గాను; కబంధుఁడనుగాను; ఖరుఁడను గాను; వాలిని గాను; మారీచుండను గాను నన్ను వారినిగాఁ దలఁపవలదు. మఱి నీవు వారిని జంపితి నని విఱ్ఱవీఁగవలదు. నేను గుంభకర్ణుఁడను; వచ్చినాను. ఇదిగో! మిక్కిలియు నినుముతోఁ జేయఁబడి బెడిదమై యున్న యీ పెనుముద్గరమును జూడుము! దీనిచేతనే నేను మున్ను దేవతలను దానవులనును జయించియున్నాను. నీవు, ముక్కు చెవులు పోయినవాఁడ నని నన్నుఁ జులకనగాఁ జూడ

* ఇందులకు 'ఆగచ్ఛ రక్షోధిప! మావిషాద మవస్థితో౽హం ప్రగృహీతచాపః, అవేహి మాం శక్రసపత్న! రామం మయా ముహూర్తాద్భవితా విచేతాః' అని మూలము. వాస్తవార్థము- 'కుంభకర్ణా! ఎంతమాత్రమును దుఃఖము నొందక, నన్నుఁ బొందుము. నిన్నుద్ధరించుటకై విల్లు దాల్చి యున్నాను, చూడుము. నన్ను నిన్నుద్ధరింప వచ్చిన రామునిఁగా నెఱుంగుము. ఇఁక శీఘ్రమున నిన్ను విముక్తునిఁ గావించెదను' అనెను.



1499. కుంభకర్ణుఁడు దారిలో వానరులను మ్రింగుచు యుద్ధమునకుఁ బోవుట ; రామలక్ష్మణులు వాని హస్తపాదములను ఖండించుట.

వలదు. ముక్కు సెవులు వోవుటచే నాకు రవ్వంతయైనను బాధలేదు. ఇక్ష్వాకు సింహమా! నా గాత్రముమీఁద నీ పరాక్రమమును జల్కాం జూపుము. అంత, నీ పౌరుషమును దెలిసి నిన్ను భక్షించివై చెదను' అనెను. కుంభకర్ణుఁడు చెప్పినది విని, యా రాముఁడు, మంచి పింజలు గల బాణములను బ్రయోగించెను. దేవశత్రుఁ డగు నా కుంభకర్ణుఁడు, వజ్రసమానవేగంబు లగు నా బాణములచేఁ గొట్టువడియు, ఎంతమాత్రమును గలంగినవాఁడును గాఁడు; దుఃఖితుఁడును గాఁడయ్యె. ఏ బాణములచే మున్ను మేటిసాలవృక్షము లేడును నఱకంబడినవో, వానరపుంగవుఁ డగు వాలియు హతుఁ డయ్యెనో, వజ్రసమానములైన యా † బాణము లిప్పుడు కుంభకర్ణుని మేని నెంతమాత్రమును గాసిపఱుపఁ జాలక పోయినవి. దేవేంద్రునిశత్రుఁ డా కుంభకర్ణుఁడు, ఆ బాణములు తనమేనం గాఁడి మఱుఁగువడఁగా, శరీరముచే వానిని జలధారలవలెఁ ద్రాగినట్టు చూపట్టుచు, నుగ్రం బగు వేగము గల యా ముద్గరమును గిరగిరం ద్రిప్పి రాముని బాణముల యురవడిని వారించుకొనెను. అంతఁ గుంభకర్ణుఁడు, నెత్తుట బ్రుంగినదియు, దేవమహాసైన్యములకును దిగులుగొలుపునదియు నుగ్రవేగంబు గలదియు నగు నా ముద్గరమును ద్రిప్పి వానరసైన్యములను దఱిమెను. అంత, రాముఁడు మీఁటయిన వాయవ్యాస్త్రమును దీసి, యా రాక్షసునిపై వేసెను. అది యతని బాహువును ముద్గరసహితముగా ఖండించెను. అంత నతఁడు బాహువు నఱకంబడి తుములముగా నఱచెను. పర్వతశిఖరాకార మగు నా కుంభకర్ణుని బాహువు ముద్గరసహితముగా రామబాణముచే నఱకంబడినదై, యా సుగ్రీవుని సైన్యమునం బడి, యందలి వానరసైనికులను జంపెను. అట్లు భంగము నొంది చావఁగా మిగిలిన వానరులు, అప్పుడు విషణ్ణు లయి, యోరలం జేరి (సమీపముం జేరి) భయమున నవయవములు గడగడ వడంకుచుండఁగా, రామునికిని రాక్షసవీరునికిని మిక్కిలియు ఘోరముగా జరుగుచున్న ద్వంద్వయుద్ధమును జూచిరి. అట్లు వాయవ్యాస్త్రముచే నొకచేయి త్రుంపఁబడఁగా, ఆ కుంభకర్ణుఁడు శిఖరము నఱకంబడిన మహాపర్వతమువలె నొప్పుచు, రెండవచేత నొక వృక్షమును బెఱికి, దానితో రణంబున రామునిమీఁది కడరెను. ఆ రాముఁడు బంగారుచే చిత్రమైన బాణమును, ఐంద్రాస్త్రమంత్రముచే నభిమంత్రించి, యంత సర్పశరీరాకారమై, వృక్షముతోడ పయికెత్తం బడియున్న కుంభకర్ణుని యా రెండవబాహువును సాలవృక్షసహితముగా ఖండించివైచెను. పర్వతాకారమైన యా కుంభకర్ణుని బాహువు ఖండితమై నేలం బడి విలవిలం దన్నికొనుచుఁ బెక్కువృక్షములను పర్వతములను శిలలను వానరులను రాక్షసులను నుగ్గు

† సప్తసాలములను భేదించినదియు వాలిని జంపినదియు నొక్క బాణమే యైనను, నిచట తద్వర్గము లైనవానిని జెప్పుటచే, బాణము లని బహువచనము తెలియునది.

గావించినది. అట్లు కుంభకర్ణుఁడు రెండుచేతులును దెగి, యఱచుచు వేగ తన పయికి వచ్చుటను జూచి, రాముఁడు తీక్ష్ణములయిన యర్ధచంద్రబాణముల రెంటిని దీసికొని యుద్ధంబున నా రాక్షసుని పాదములను ఛేదించివైచెను. ఆ కుంభకర్ణుని పాదములు రెండును బడఁగా, ఆ ధ్వని, దిక్కులను విదిక్కులను పర్వతములను గుహలను మహాసముద్రమును లంకాపురమును, వానర రాక్షససైన్యములను మాఱుమ్రోయించుచు నిండి చెలంగినది. కుంభకర్ణుఁ డట్లు చేతులు తునిఁగి పాదములును ద్రుంగిపోవఁగా, బడబాముఖమువలె విరివియైన నోరిని దెఱచుకొని, గర్జించుచు నంతరిక్షమునందు చంద్రునివలె నున్న రామునిపై రాహువుంబోలె, తునిఁగి మిగిలిన తొడలచే వేగమునఁ దలపడెను. రాముఁడు వాఁడిమొనలు గలిగి, బంగారుపూఁత పింజలతోఁ గూడిన బాణముల నా కుంభకర్ణుని నోటినిండఁ బూరించెను. అతఁడు నోటినిండ నమ్ములు నిండియుండుట వలన మాటాడం జాలక, యెట్టకేలకుఁ గో యని యార్చి మూర్ఛయు నొందెను. అంత, రాముఁడు, సూర్యకిరణములవలె వెలుఁగుచు బ్రహ్మదండమునకును ప్రళయకాలయమునకును సాటియై, పగవారి కశుభప్రదంబును, సుపుంఖమును, వాయువేగంబును, వాఁడియు నైన యైంద్రబాణమును దీసికొనెను. వజ్రమువలెఁ గఠినముగాను బంగారుమయముగాను సుందరముగాను నున్నపింజతోఁ గూడినదై, వెలుంగుచున్న సూర్యునివలెను జ్వలించుచున్న యగ్నివలెను ప్రకాశించుచు, ఇంద్రుని వజ్రాయుధమువలెను బిడుగువలెను సురవడిగలిగియున్న యా బాణమును రాముఁడు కుంభకర్ణునిపైఁ బ్రయోగించెను. రాముఁడు బాహుబలముకొలఁదియు నా బాణమును వైవఁగా, అది పొగతోఁగూడి జ్వలించుచున్న యగ్నివలెఁ జూపట్టుచు, ఇంద్రుని వజ్రాయుధమువలె బలమును పరాక్రమమునుం గలిగి, తన కాంతిచే దశదిశలను వెలింగించుచు, కుంభకర్ణుని మీఁదికిఁ బోయెను. ఆ బాణము, మున్ను దేవేంద్రుఁడు వృత్రాసురుని శిరమును ఖండించినట్లు, మహాపర్వతశిఖరాకారమై, తిరుగుడువడ్డ వెనుకోఱలతోఁ గూడి * సుందరము లగు కుండలములు చౌకళించుచున్న యా కుంభకర్ణుని శిరస్సును ఖండించెను. రెండు కుండలములచే నలంకృతమై, ఖండనవేగమున నాకాశగతమై యున్న కుంభకర్ణుని పెనుశిరస్సు, రాత్రియం దుదయించి పునర్వసునక్షత్రములు రెండింటి నడుమ నుండు చంద్రునివలెఁ బ్రకాశించెను. రామబాణమునఁ గొట్టుపడి పర్వతాకారం బగు నా కుంభకర్ణుని శిరస్సు నేలం బడఁగా, ఆ దెబ్బకు చర్యాగృహములును పురద్వారములును పొడవయిన ప్రాకారమును విఱిగి నేలం గూలినవి. మఱియు, నా కుంభకర్ణుని కళేబరము పడఁగా,

* ఇట కుండలము లున్నవనుటచే సుగ్రీవుఁడు కుంభకర్ణుని చెవులను కుండలములు వేసికొను భాగము దప్పఁ దక్కినదానిని గొఱికికొన్నాఁ డని, తెలియునది—మహేశ్వరతీర్థులు.

